**Sheelam Bhadraiah**

# MUSTHADU

**(Telugu Poetry)**

శీలం భద్రయ్య

# ముస్తాదు: కవిత్వం

**(ద్వితీయ ముద్రణ)**


**Sheelam Bhadraiah**
**H.No. 8-1-510, Plot No. 25,**
**Padmavathi colony, Nalgonda**
**Town, Telangana State- 508001**
**Mobile No: 9885838288**

**ISBN : 978-93-5895949-9**

**Copies: 500**
**Pages: 112**
**Price: 120/- Rs**
**Second Edition, July 2025**

**Cover Photo:**
**Sri Bolleddu Kishore Kumar**
**Writer, Artist, Teacher, Director**

**Karshak Printers, Hyderabad**

**Sheelam Publications,**
**Nalgonda**
**Publication No. 04**

*** Available at all**
**major bookstores**


ఇం.నెం. 8-1-510, ప్లాట్ 25
పద్మావతి కాలని, నల్లగొండ పట్టణం,
నల్లగొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం,
508001,
మొబైల్ నంబరు: 9885838288

పేజీల సంఖ్య 112
ధర : 120 రూ.లు
ద్వితీయ ముద్రణ: జూలై 2025
ప్రతులు: 500

ముఖచిత్రం: శ్రీ బొల్లెద్దు కిశోర్
కుమార్ గారు
సినీదర్శకులు, చిత్రకారులు,
రచయిత, ప్రభుత్వ ఉపాధ్యాయులు

ముద్రణ: కర్షక్ ముద్రణాలయం,
హైదరాబాదు
శీలం ప్రచురణలు- సంఖ్య .4
* అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో
లభించును.



స్వతంత్ర కాంక్షను రగిలించి బహుజనులకు రాజ్యాధికారమే లక్ష్యంగా మొగలాయి, నిజాముతో పోరు సలిపిన సమర అమర యోధ, సబ్బండ వర్గాల ఛత్రపతి, గౌడ జాతి ఆత్మగౌరవ పతాక **సర్దార్ సర్వాయి పాపన్న గౌడ్** పోరాట స్ఫూర్తికి "ముస్తాదు" కవిత్వం అంకితం.

**–శీలం భద్రయ్య**



“తాటి గెలను గీసినట్టు
నాయిన నా నొష్టన
నాలుగక్షరాలను రాసి
మొగిని చేరుకుండు.”

**–శీలం భద్రయ్య**

**మునాసు వెంకట్**
తెలంగాణ జీవ కవి
సెల్: 9948158163

## మండువాలో "ముస్తాదు" పండుగ

"రేకపట్టి చూడు రేఖ మారుతుంది" అన్నడు గీతకారుడు. కుంకుడు, వీర ముష్టి, నాగముష్టి బద్ద మీద కాదు ఆత్మమీద సానపెట్టుకున్న గీతకారుడొకడు వచ్చిండు. పుట్టతాడు తాగి పురివిప్పిండు. వడభట్ల కల్లు తాగి దడ పుట్టిస్తుండు. పటువల నిండా పారవశ్యమై ఉంది. ఒక పట్టు పట్టమంటుండు. అతనే "ముస్తాదు" కవి శీలం భద్రయ్య.

మండువాలో సబ్బండ జాతుల పండుగంట. తన "ముస్తాదు" సాక్షిగా చెబుతున్నాడు. తెలంగాణ అస్తిత్వ కవిత్వం అప్పటివరకు ఉన్న కవిత్వాన్ని, భాషని, రూపురేఖలు లేకుండా చేసింది. ముఖ్యంగా ఉత్పత్తి కులాల భాష, జీవన నేపథ్యంలో, తెలంగాణ సంస్కృతిని ఈ మట్టి పరిమళాలని, కులవృత్తులతో పెనవేసుకొని అసలు సిసలైన నుడికారాలు, పదచిత్రాలతో తెలంగాణ జీవితాలని బొమ్మ కట్టించింది. అదే నిజమైన దేశీ కవిత్వం. గత కవిత్వపు ఆనవాలు లేకుండా, పాటిగడ్డ నుంచి, మట్టి వాసన వెదజల్లుతున్న జీవ కవిత్వమే నిజమైన కవిత్వం. తాటి కమ్మల మీద బాపనాయన రాసుకుంటే, తాటి కల్లు తాగి బడుగు జీవులు నాలికల మీద తరతరాలుగా రాసుకున్నదే మన జీవితంలో భాగమైన తెలంగాణ సామెతలు. అవిప్పుడు మనకు నిత్య సత్యాలు నిత్య తత్వాలు.

తెలంగాణలో గోసంగి కవుల తరువాతనే అస్తిత్వ కవిత్వం ఊపందుకుందని చెప్పాలి. ఇప్పుడు తెలుగు కవిత్వంలో ఉత్పత్తి కులాల కవిత్వం అనివార్యమైంది. కవిత్వమే కాకుండా, భాష కూడా విస్తృతి చెందింది. "ముస్తాదు" కవిత్వం చదువుతుంటే మంచిగ మాగిన తాటిపండు వాసన అంతరాన్ని చుట్టుముట్టింది. అతని మండువా చుట్టూ పదాలు పరిగెత్తినై. ఈ కవి కవిత్వానికి కల్లు తాపుతుండు. సబ్బండ జాతులు

తాళ్ళను ఆలింగనం చేసుకొని బాధలన్నీ మరిచిపోయి, సేదతీరిన శ్రమైక సౌందర్యమే ఈ "ముస్తాదు" కవిత్వం. మూడుగీతల కల్లు ఒడిసి ఒడిసి, వళ్ళు హూనమైన గౌడన్నల జీవిత గాయాలను కవి శీలం భద్రయ్య తన కవిత్వం ద్వారా వాళ్లని పరామర్శించిన తీరుకు అబ్బురపడతాం.

శీలం భద్రయ్య తన కథల ద్వారా ఇప్పటికే తెలుగు సాహిత్యంలో కథా రచయితగా మంచి పేరున్నవాడు. ఇప్పుడు కవిగా "ముస్తాదు" కవిత్వంతో తెలుగు కవితా ప్రియుల ముందుకు వస్తున్నాడు. కల్లు అంటే ఇష్టపడేది ఊళ్లో ఉండే సబ్బండ జాతులే కాదు, గ్రామ దేవతలకు కూడా కల్లు అంటే ఎంత ప్రాణమో చూడండి.....

"ఊర ముత్యాలమ్మకు
కల్లు తాగబుద్ధయింది
సాకపోసి కావడి కట్టమంది"

తెలంగాణలో బోనాల పండుగకు, అమ్మవారికి, పోతురాజు సాక్షిగా కల్లు శాకపోయడం ఆనవాయితి. తరతరాలుగా జరుపుకుంటున్న సబ్బండ జాతుల పండుగ ఇది. అందుకే అంటాడు కవి...

"జీవుడికి
కల్లు పోత
దేవుడికి
ఆరబోత"

కల్లు తాగిన కంటికి ఆకాశం నక్షత్రాలు పెద్దదూరం ఏమి కాదు. వెన్నెలతో వాళ్లు వేడుక చేసుకుంటారు.

" జీవితంలో
ఎన్ని పాట్లు పడ్డా
మండువా దగ్గర
ఒక పట్టుతో
పాట్లన్నీ పాటగా మారుతాయి"

ఎన్ని బాధలున్నా తన వృత్తి పట్ల ఉన్న గౌరవాన్ని, కళాత్మకతను కవి మరిచిపోడు. ఉత్పత్తి కులాల కవులకున్న సజీవ దృష్టి కవిత్వానికి, ఆత్మని

ప్రాణాన్నిస్తుంది. కవిత్వాన్ని చదువుతున్నప్పుడు ఆనాటి జీవిత విధానమే కాదు. వాళ్ల కాస్మోటీక్స్ కూడా కళ్ళల్లో కదిలితేనే అది జీవకవిత్వం అవుతుంది. అలాంటి అన్ని లక్షణాలున్న కవి శీలం భద్రయ్య. కవికి పసిహృదయం, లేలేత చూపులు ఉంటాయి. ఆ అలౌకికతే కవిత్వంలో అద్భుతాలు సృష్టిస్తుంది.

" పిల్లగాలికి తాటాకులు
పిల్లల్లా
గలగలమని నవ్వుతాయి"

తన ఉత్పత్తి కులంపట్ల, తన జీవితంపట్ల, కలిగిన శ్రద్ధని పసితనాన్ని, ప్రకృతి కవిలో మార్మికంగా విస్తరిస్తుంది. "ముస్తాదు"ని మండువాలో తాగుతూ చదువుతూ నృత్యం చేస్తే తెలుస్తుంది తాళ్లతో తన్మయత్వం. అడుగుదీసి అడుగేస్తే రూపుకట్టే తోవలు, అంతరంగమంతా పద చిత్రాలే.

సగం కుబుసం విడిచిన
నల్లని తాచులా
గెట్టుమీద
గరిమట్టల బొత్త"

ఈదులల్ల, తాళ్లల్ల తారాడని తనువు ఎందుకనే తత్వం ఒకటి ఉంది. అన్ని కులాలు కలిసే మండువా నిజంగా అది తాళ్ల మటమే. జంగమోడో, సాతానోడో తేలేది గీ పంతంగి తాళ్లలోనే. ఇది తెలంగాణ సామెత. ఈ కల్లుతోటే ముడిపడి ఉన్న ఒక సందర్భం.. చావు బతుకులో ఉన్న ఒక చిన్న పిల్లవాణ్ణి వైద్యుడు "లాభం లేదు ఇంటికి తీసుకుపోండి" అన్నప్పుడు ఆ తల్లిదండ్రులు పుట్టెడు దుఃఖంతో ఊర్లోకి అడుగుపెడతారు. తాడు మీద ఉన్న గౌడు 'ఏమైందని' అడిగితే, జరిగిందంతా చెబుతారు. ఆ గౌడు సరసర చెట్టు దిగి ఆ పిల్లగాని గొంతులో గింత కల్లు పోస్తాడు. దెబ్బకి ఆ పిల్లగాడు కళ్ళు తెరుస్తాడు. ఆ పిల్లగాడే, తెలుగు సాహిత్యంలో లబ్ధప్రతిష్ఠ పొందిన కథకుడు బోయ జంగయ్య గారు. కల్లు అమృతమైందని బోధపడే ఉదాహరణ ఇది. కల్లుతోటి పొద్దు పొడిచి, కల్లు తాగిన నిజాలతో మండువాలో పొద్దుగూకుతుంది. ఆకాశం దిక్కు, నేల దిక్కు చూస్తూ నిజం ఒకటి చెబుతాడు కవి....

"నెలవంకకైనా
వంక పెడతారేమో,
వంకతాడుకు
ఏ వంక లేదని" నిర్దేశించాడు.
శ్రేష్టమైన కల్లు రుచి చూపిస్తాడు కవి. అందుకే అంటాడు...
"కుండంత కల్లుతో
కొండంత బలగం"

ఈ క్రమంలో కవి తన వెంట నడుస్తున్న బలగాన్ని మర్చిపోడు. ఇదే కవికి ఎదుగుదల. తెలంగాణలో వచ్చిన అన్ని ఉద్యమాలలో భాగస్వాములైన వాళ్ళు, ఆర్థికంగా, రాజకీయంగా, ఎనుక బాటుగా ఉన్నా, ప్రశ్నించేతత్వంలో ముందువరుసలో ఉన్నవాళ్లు గౌడ సామాజిక వర్గం. ఆ వర్గంలోనుంచి వచ్చినవాడే శీలం భద్రయ్య. ఈ కవి "ముస్తాదు" కట్టుకొని పాఠకున్ని మండువాలోకి ఆహ్వానిస్తున్నాడు.

బహుజనులు దళితులతో మమేకమైనప్పుడే, రాజకీయంగా ఎదుగుతారని, ఎరుక కలిగినవాడు. తన 'గౌడమ్మ' గౌరవ మర్యాదను గౌరమ్మలాగా సామాజికతత్వంగా తన కవిత్వంతో నిర్దేశించాడు. గౌడతత్వాన్ని సౌందర్యంగా కవిత్వం చేసినవాడు శీలం భద్రయ్య. కవిత్వంలో సంగీతమై దాచుకున్నవాడే నిజమైన కవి.

**–మునాసు వెంకట్**
తెలంగాణ జీవ కవి

**డాక్టర్ తండు కృష్ణ కౌండిన్య**
అధ్యక్షులు, తెలుగు శాఖ
ప్రభుత్వ డిగ్రీ కళాశాల, రామన్నపేట
సెల్: 9704731346

## గౌడుల అస్తిత్వం ప్రతిబింబించే కవిత్వం

పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధంలో కీర్కు గార్డు అనే డేనిష్ తత్త్వవేత్త రచనల ఆధారంగా ప్రారంభమైన ఒక తాత్త్విక దృక్పథమే అస్తిత్వవాదం. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత జర్మనీలోనూ, మరి కొంత కాలానికి ఫ్రాన్స్, ఇటలీ దేశాలలోనూ నాస్తికవాద ఛాయలతో ఈ దృక్పథం పెంపొందింది. 1964లో నోబెల్ బహుమతిని తిరస్కరించిన ఫ్రెంచి నవలా కారుడు, తత్త్వవేత్త జీన్పాల్ సార్ట్రె రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఈ వాదాన్ని ఫ్రాన్స్‌లో విస్తరింపజేశాడు. వ్యక్తి మనుగడ (అస్తిత్వం)లో మానవాతీత శక్తుల ప్రమేయం లేదని, అతడికి స్వీయ నిర్ణయ స్వేచ్ఛ ఉన్నదని, ఎవరికి వారు తమ జీవనశైలిని, మూర్తిమత్వాన్నినిర్మించుకోవడమే గాని, అది తలరాతను బట్టి జరిగేది కాదని, ఎవరు చేసే పనులకు వారే బాధ్యులని ఈ సిద్ధాంతం ప్రతిపాదిస్తుంది. అంటే ఎవరు చేసే పనులకు వారే కర్తలు– మంచికైనా, చెడుకైనా. స్వీయ కర్తృత్వమే గాని మరెవరికో, అలౌకికమైన మరే శక్తికో ఇందులో ప్రమేయం లేదని సారాంశం. 'వ్యక్తి కర్తృత్వానికే విలువ ఇచ్చే సిద్ధాంతం కనుక దీనిని స్వీయ కర్తృత్వ వాదమని కూడాఅంటారు.

అనాది నుండి ఈ సృష్టిలోని ప్రతి ప్రాణి తన అస్తిత్వం కోసం పోరాటం చేస్తూనే ఉంది. సాటి ప్రాణులతో నిరంతరం ఘర్షణ పడుతూ మెరుగైన జీవితం కోసం ఆరాటపడుతూనే ఉంది.ఆది మానవుడు చెట్టు తొర్రలో, కొండ గుహలో జీవనాన్ని కొనసాగించే స్థితి నుండి నేటి వరకు కాల చక్ర గమనంలో నిరంతరం అనేక పోరాటాలు చేస్తూ ఒక తెలివైన జీవిగా మిగతా జీవుల కన్నా భిన్నంగా జీవనాన్ని కొనసాగిస్తూ మొత్తం జగత్తునే తన గుప్పిట్లో ఉంచుకోవాలన్న తపనతో ముందుకు సాగుతున్నాడు. ఇదంతా మనిషి తన అస్తిత్వం చాటుకోవడం కోసంచేసిన ప్రయత్నమే. మానవులు అనేక వర్ణాలు, కులాలుగా విభజించబడిన సందర్భంలో బలవంతుడు బలహీనుని పీడించిఅతని ఉనికిని లేకుండా చేసి ఆధిపత్యం

చెలాయిస్తున్నప్పుడు అణగదొక్కబడినటువంటి కులాల వారు తమ ఉనికిని కాపాడుకోవడం కోసం నిరంతరం పోరాటం చేస్తూనే ఉన్నారు. స్త్రీ వంటింటికి పరిమితం కావడం, దళితులు అంటరాని వారుగా వివక్షకు గురి కావడం, ఆధిపత్య వర్గాలు నిమ్న వర్గాల వారిని అణగదొక్కడం వంటి కారణాలవల్ల ప్రతి ఒక్కరు తమ అస్తిత్వం కోసం పోరాటంచేయడం ప్రారంభించారు. ప్రపంచవ్యాప్తంగా ఆయా భాషా సాహిత్యాల్లో అస్తిత్వ సాహిత్యం వెలువడినట్లుగానే తెలుగులో కూడా అస్తిత్వ సాహిత్యం వెలువడింది.

జాతీయోద్యమ కాలంలో తెలుగు నేల, జాతి, భాష ఔన్నత్యాన్ని కొనియాడుతూ పలువురు కవులు, రచయితలు అనేక రచనలు గావించారు. 1940 దశకంలో జరిగిన తెలంగాణ సాయుధపోరాట నేపథ్యంలో ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమ సాహిత్యం వెలువడింది. 1970 తర్వాత దళిత, స్త్రీ, బీసీ, ముస్లిం మైనార్టీ వాద ఉద్యమాలు రావడం వల్ల ప్రతి ఒక్కరు తమ ఉనికిని చాటుకోవడం కోసం ప్రయత్నించారు. అందులో భాగంగా కవులు, రచయితలు తమ కలాలకు పని చెప్పారు. ఈ క్రమంలో బీసీలు కూడా తమ ఉనికిని చాటుకోవడం కోసం తమ తమ వృత్తుల గొప్పతనాన్ని ప్రపంచానికి తెలియడం కోసం, తాము మరింతగా తలెత్తుకొని తిరగడం కోసం, విద్య ఉపాధి రాజకీయ రంగాలలో తమ వాటాను పొందడం కోసం కలాలను ఆయుధాలుగా మార్చి ఉద్యమిస్తున్నారు. వెనుకబడిన తరగతుల్లోని అన్ని కులాలవారు తమ అస్తిత్వం కోసం ఆయా కులాలకు చెందిన కవులే కాకుండా ఇతర కవులు కూడా ఆయా వృత్తుల గొప్పతనాన్ని తెలియజేస్తూ సాహిత్య సృజన గావిస్తున్నారు.

ప్రముఖ కవి జూలూరు గౌరీ శంకర్ ఆధ్వర్యంలో మొట్టమొదట బీసీ అస్తిత్వ స్పృహతో "వెంటాడే కలాలు వెనకబడ్డ కులాలు" అను పేరుతో కవితా సంకలనం 2002 సంవత్సరంలో వెలువడింది. ఇందులో బీసీ కులాలకు చెందిన కవులు తమ కులాల ఆస్తిత్వాన్ని ప్రకటిస్తూ రాసిన కవితలు ఉన్నాయి. అదేవిధంగా గౌడుల అస్తిత్వాన్ని చాటుతూ పలువురు కవులు, రచయితలు గౌడుల ఆస్తిత్వాన్ని తమ రచనల ద్వారా తెలియజేశారు. వారిలో మామిండ్ల రామా గౌడ్, ఆచార్య ననుమాస స్వామి, నేరెళ్ల శ్రీనివాస్, కె. వి. ఎల్, కొంపెల్లి వెంకట్ గౌడ్, డాక్టర్

తండు కృష్ణ కౌండిన్య ,మోత్కుల నారాయణ గౌడ్, డాక్టర్ పాండాల మహేశ్వర్, డాక్టర్ తండ హరీశ్ గౌడ్, మెరుగు మల్లేశం, నకిరెకంటి శ్రీనయ్య గౌడ్, పల్లె దీక్షిత మొదలగువారు గౌడుల అస్తిత్వాన్ని తమ రచనల ద్వారా చాటి చెప్పారు. గౌడ కులస్తుడు కాకపోయినా ప్రముఖ కవి అంబటి వెంకన్న రాసిన 'కల్లు పాట' గేయం ఎంతో ప్రాశస్త్యాన్ని సంతరించుకుంది. ఇదే స్పృహతో కవిత్వం రాస్తూ గౌడ జాతి అభ్యున్నతి కోసం పాటుపడుతూ గౌడ జాతి ఆత్మాభిమానాన్ని, గౌడుల జీవన విధానాన్ని చాటి చెబుతూ శీలం భద్రయ్య రాసిన కవితా సంపుటే ఈ 'ముస్తాదు'.

శీలం భద్రయ్య కథా రచయితగా, కవిగా, నాటకరచయితగా, విమర్శకులుగా సాహితీలోకంలో సుప్రసిద్ధులు. ఈయన గౌడ కులఅస్తిత్వ స్పృహతో రాసిన కవితా సంపుటి ముస్తాదు. ఇందులోని కవితలు గౌడుల జీవితాన్ని ప్రతిబింబింపజేస్తాయి. గౌడ జాతి జీవన విధానం, సంస్కృతి, ఆవేదనలు అంతా తన కవిత్వంలో చర్చకు పెట్టారు. మచ్చుకు కొన్ని కవితల్ని పరిశీలిద్దాం.

తాటి చెట్టుతో గౌడు నడుముకు ఉన్న మోకు బిడ్డ మెడలో బొడ్డుతాడుగా ఉంటుందని చెప్పడంలో తల్లికి బిడ్డకు ఉన్న పేగు బంధం గొప్పతనాన్ని తెలియజేశారు. ఆరుద్ర కార్తెలో ఆరుద్ర పురుగు ఏ విధంగా ఉంటుందో గౌడన్నల జీవితం కూడా ఉరుకులు పరుగుల జీవితమని చెప్పడం బాగుంది. "శ్లోకం కంటే శోకాన్ని పాపే నా రేకపవిత్రం" అంటూ శ్లోకం వల్ల శోకం తొలగిపోతుందో లేదో తెలియదు కాని రేక వల్ల శోకం తొలగిపోతుంది అని చెప్పడం నిజమైన అస్తిత్వ వాదానికి నిదర్శనం. గుక్కపట్టి ఏడ్చేపాపకు తీయటి కల్లును తాగించినప్పుడు తప్పకుండా ఆ బిడ్డ దుఃఖాన్ని తీర్చి వేస్తోంది. ఎంత నిజాయితీగా కల్లు పోసినా తృప్తి పడని వారికి దీటుగా సమాధానం ఇస్తూ "యాదికుంచుకో మందు కల్లు కాదు మాది/ ఎతశితకు మందు కల్లు"అంటూ కల్లు తాగడం వల్ల కలిగే ప్రయోజనాలను తెలియజేశారు..పిల్లుందా? కల్లుందా? అని కొంతమంది ఎగతాళి చేస్తూ మాట్లాడే వారికి ఒక చురక అంటిస్తూ ఇలా చెప్పారు. "మందువాలో కల్లుందా పిల్లుందా అని అడగకండి / అమ్మా చెల్లె ఉంది". కామంతో కళ్ళు మూసుకొని వృత్తి పట్ల చులకన భావం ఉన్నవారు ఇలాంటి ఎగతాళి మాటలు మాట్లాడినప్పుడు అది సరైనది కాదంటూ ప్రతి ఒక్కరిలో ఒక అమ్మను, చెల్లెను చూడాల్సిన బాధ్యత ఉందని గుర్తు చేశారు. మంగళవాయిద్యాలతో

కట్టిన మామిడాకు కన్నా తాటాకే గొప్పదంటారు. తాటిచెట్టు కల్పవృక్షంలాంటిదని దానిలోని ప్రతి అణువు మానవాళికి ఎంతో ఉపయోగపడుతుంది. అందుకే “కర్ణుడిలా వనంలోని తాటిచెట్టు కల్పవృక్షమే/ కోరిందల్లా లేదనకుండా ఇస్తుంది”అని తాటి చెట్టు గొప్పతనాన్ని కర్ణుడితో పోల్చడం సహజంగా  ఉంది. గౌడు తాటి చెట్లు ఎక్కి వయసు మీద పడివెన్ను వంగిపోయినా అతడు తన వృత్తిని కొనసాగిస్తూనే ఉంటాడు. అలాంటి స్థితిలో అతనికి తాటి చెట్టే భరోసా ఇస్తుందని కవిత్వీకరించి చెప్పిన విధానం బాగుంది.“గౌడు ఎన్ను వంగిపోయినా/ అతని కోసం చెట్టు నిటారుగా నిలబడింది” అని చెప్పడంలో తాటి చెట్టు వృద్ధాప్యంలో ఉండే గౌడన్నలకు ఆదరువు అన్న విషయాన్ని స్పష్టపరిచారు. గౌడులు కల్లు అమ్మే ప్రాంతాన్ని మండువా అంటారు. ఈ మండువా దగ్గరికి సమస్త కులాల వారు వచ్చి కల్లు తాగి తమ దాహాన్ని తీర్చుకుంటారు. అందుకే ఎన్ని బాధలతో వచ్చినా ఆ బాధలన్నింటిని మరిచిపోయి హాయిగా ఇంటికి మండువా నుండి పోతారంటే సమస్త కులాల వారి బాధను తొలగించే ఒక అద్భుతమైన శక్తి  మండువాకు ఉంటుందని చెబుతూ “జీవితంలో ఎన్ని పాట్లు పడ్డా/ మండువా దగ్గర ఒక పట్టుతో/ పాట్లు పాటగా మారుతాయి”అని చెప్పడమే ఇందుకు నిదర్శనం.

అస్తిత్వ ఉద్యమంలో భాగంగా ప్రతి కులం వారు  తమ తమ అస్తిత్వాన్ని చాటి చెప్పడం కోసం నిరంతరం ప్రయత్నం చేస్తూనే ఉన్నారు. అందులో భాగంగా కవులు, కళాకారులు కూడా తమ అస్తిత్వాన్ని ప్రకటించడం కోసం పాటుపడుతున్నారు. ఒక గౌడ జాతి బిడ్డగా శీలం భద్రయ్య తన జాతి అస్తిత్వాన్ని ఇందులోని కవితల ద్వారా చాటి చెప్పారు. కల్లు తాగి గౌడులను చులకన భావం చేసే వారిని ఉద్దేశించి చెప్పిన కవిత ఇది.”కల్లు తాగి తేలికగా మాట్లాడకు/ మండువా మా భరతమాత/ తాటి చెట్టు మా జాతి పతాక/ సర్వాయి మా జాతిపిత”అంటూగౌడుల ఆత్మాభిమానాన్ని చాటారు. మండువాయే తమ భరతమాతయని, తాటి చెట్టు తమ జాతి పతాకయని, సర్వాయి పాపన్న తమ జాతిపిత అని చెప్పడం తన కులం ఆస్తిత్వాన్ని గొప్పగా తెలియజేయడమే. ప్రతి కులంలో కూడా ఇలాంటి స్పృహ అస్తిత్వ ఉద్యమం వల్ల కలిగినటువంటిదే. అందుకే ఇవ్వాళ ప్రతి కులం వారు కూడా తమ తమ  కులాల గొప్పతనాన్ని చెప్పుకోవడమంటే ఆత్మాభిమానాన్ని కలిగి ఉండి మరింత ఆత్మస్థైర్యంతో

మనోనిబ్బరంతో ముందుకు వెళ్లాలన్న ప్రబోధం అస్తిత్వ సాహిత్యంలో కనబడుతుంది. అదే శీలం భద్రయ్య కవిత్వంలో కూడా కనిపిస్తుంది. ప్రపంచీకరణ వల్ల కులవృత్తులు కునారిల్లిపోతున్న ఈ సందర్భంలో గీత వృత్తి కూడా ఏ విధంగా నిరాదరణకు గురవుతుందో తన కవిత్వం ద్వారా తెలియజేశారు. కల్లు మత్తు పానీయం కాదని, అది మనిషికి మరింత ఆరోగ్యాన్ని కలిగిస్తుందని తెలియజేస్తూ "వజ్ర దేహానికి మడ్డి కల్లు/ వట్టి దేహానికి తియ్యటి కల్లు" అంటూ కల్లు విశిష్టతను తెలియజేశారు. అదేవిధంగా "కల్లు అంగడి సరుకు కాదు/ అమ్మ రొమ్ములా అమృతం"అంటూ మార్కెట్లో దొరికే మద్యం కన్నా కల్లు చాలా పవిత్రమైనదని తేల్చి చెప్పారు. ఒక వృత్తి గొప్పది మరొక వృత్తి తక్కువది అని కాకుండా ప్రతి వృత్తి గొప్పదే అనుభావన అస్తిత్వ పోరాటంలో భాగంగా వచ్చినటువంటిది. శీలం భద్రయ్య కూడా కవిగా మాత్రమే కాకుండా ఒక గౌడ బిడ్డగా గౌడ వృత్తి గొప్పతనాన్ని తన కవితల ద్వారా చాటి చెప్పారు. చెట్టును ఎగబాకి కల్లు తీయడమే కాదు అన్యాయాన్ని ఎదిరించడం కూడా గౌడుల రక్తంలో ఉందంటూ ఇలా చెప్పారు."ఎదిరించడం ఎగబాకడంతెలిసిన/ కత్తులు ధరించే సర్వాయి వారసులం"అంటూ గౌడులు తాటి చెట్టును ఎగబాకడమే కాదు రోషం ఉన్న వీరులని, బహుజనులను ఏకం చేసి గోల్కొండ కోట సింహాసనాన్ని అధిష్ఠించిన సర్వాయి పాపన్న వారసులని చెప్పారు. రియల్ ఎస్టేట్ వ్యాపారం తాటి చెట్లను నరికి వేస్తూ గౌడవృత్తిని విధ్వంసం చేస్తున్న విషయాన్ని మన కళ్ళ ముందు ఉంచారు.ఎంత ఎత్తుకు తాటి చెట్టును ఎక్కినా గౌడుల జీవితాలు చాలా దుర్భరంగా ఉన్నాయని ఆవేదన వ్యక్తీకరించారు.

శీలం భద్రయ్య అద్భుతమైన కథనా నైపుణ్యంతో కథలను రాయడమే కాకుండా చక్కని భావనా శక్తితో శిల్ప సౌందర్యం కలిగిన కవితలు రాయడంలో కూడా దిట్ట. వీరి కవితల్లో చక్కని భావ చిత్రణతో పాటు శిల్పం కూడా ఉండి ఆ కవితలకు మరింత వన్నె తెచ్చాయి."చిడతబద్ధ పై నెరుసుపొడిలా/ ఆలోచనాయుధానికి కాలం పదును పెడుతుంది" అంటూ కాలాన్ని నెరుసు పొడితో పోల్చడం అద్భుతం. అదేవిధంగా "ఎక్కి దిగే బతుకులని ఎగతాళి చేయకండి/ తాళిని పణంగా పెట్టి తాడును గీస్తున్నాం" అనడంలో గౌడ వృత్తి ఎంతటి ప్రమాదకరమైనదో అర్థమవుతుంది. రోజుకు మూడుసార్లు తాటి చెట్లను ఎక్కి దిగుతూ ఎప్పుడు కాలుజారి చనిపోతారో

తెలియని పరిస్థితి. అందుకే గౌడు భార్య తాళి ఎప్పుడు ఉంటదో, పోతదో తెలియని స్థితిని తెలియజేస్తూ తాళిని పణంగా పెట్టడం అనే ప్రయోగం చేయడం జరిగింది. తాటి చెట్లు జాగ్రత్తగా దాచుకున్న గుడ్లుగా తాటిముంజలను, నిత్యం మూడుసార్లు తాటి చెట్టును మొక్కే గౌడు అసలు సిసలైన ప్రకృతి పూజారిగా అభివర్ణించిన విధానం బాగుంది. తాటి పండుమట్టి పొదల్లో దాక్కొని తోకతో తొంగి చూసింది, కల్లు తాగిన వెన్నెల నవ్వితే చీకటి కూడా చిన్న పోయింది, తాడు మీదున్న ఆశలకు ఈదరగాలి సమాధి కట్టింది, బుంగమూతి పెట్టకు బుంగలోని పొంగుతున్న కల్లుమనకోసమే నవ్వుతుంది. తాతలు నాటినుండి అనంత చీకటిని అక్షర జ్యోతిగా వెలిగించినది తాటాకు అంటూ చెప్పిన కవితలు చక్కని భావచిత్రణకు నిదర్శనాలు.

వృత్తిపట్ల ఉన్న గౌరవం, నిబద్ధత,అస్తిత్వస్పృహ ఇవన్నీ శీలం భద్రయ్య కవిత్వంలో కనిపిస్తాయి. వస్తువుతోపాటు అద్భుతమైన భావచిత్రణ, శిల్ప సౌందర్యం కలిగి పాఠకుల మెదళ్లలోకి అతి సులభంగా ప్రవేశించే విధంగా ఇందులోని కవితలు ఉన్నాయి. ఇప్పటివరకు తెలుగు సాహిత్యంలో గౌడవృత్తి సంబంధమైన రచనలు చాలా వచ్చినప్పటికీ ఒక వచన కవితా సంపుటిగా వెలువరించిన వారు లేరని చెప్పవచ్చు. అందుకే ఈ 'ముస్తాదు' "తొలిగౌడ ఆధునిక వచన కవితా సంపుటి"గా తెలుగు సాహిత్యంలో నిలిచిపోతుంది. ఇలాంటి రచనలు పాఠకుల్ని ఆలోచింపజేసి మరింత అస్తిత్వ స్పృహను కలిగిస్తాయి. శీలం భద్రయ్యను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

**–డాక్టర్ తండు కృష్ణ కౌండిన్య**

అధ్యక్షులు, తెలుగు శాఖ

**శీలం వీర శేఖర్ గౌడ్**
అసిస్టెంట్ ప్రొఫెసర్, ప్రభుత్వ డిగ్రీ మహిళా కళాశాల
గజ్వేల్, సిద్ధిపేట జిల్లా

## వేయాల్సిందే ...వీరతాడు

గౌడ్ కుటుంబంలో పుట్టిన ప్రతి మగ, ఆడబిడ్డ జీవితాన్ని కళ్ళకు కట్టినట్లు రాసిన ఈ కవితాసంపుటి అమోఘం. ఇది చదివిన తరువాత నా జీవితం ఒక్కసారిగా గిర్రున తిరిగి గత జ్ఞాపకాలతో మనస్సు భారమెక్కింది. కొన్ని కవితల్లో నాకు గర్వంగా అనిపించింది. ఎందుకంటే విమానాన్ని కనుగొనకముందే గౌడ్ అంతరిక్ష యాత్రికూడయ్యాడు. ఆ విహంగా వీక్షణం చేసిన తొలి మనిషి నా గౌడ బిడ్డే మరి!

"శబరీ !
వనంలో కల్లు దొరకలేదా !?
రేగుపళ్ళు పెట్టావు !!

కవితా వాక్యాలతో మరొక రామాయణం రాయవచ్చనిపించింది. శ్రీరాముడు క్షత్రియుడు. మన దక్షిణ భారతీయ సంప్రదాయం ప్రకారం మాంసంతో కూడిన భోజనం, కల్లు ఆతిధ్యం ఇస్తాము. రాముడు మాంసాహారి అని కొందరు భావిస్తారు. శబరి మన సంప్రదాయానికి భిన్నంగా "రేగుపళ్ళు" ఎందుకు పెట్టిందనే ప్రశ్న ఈ కవితలో ఉదయిస్తుంది. ఒకవేళ శబరి మన సంప్రదాయం ప్రకారం కల్లుతోటి ఆతిధ్యం ఇస్తే, అందరూ ఈనాడు దాన్ని గొప్ప తీర్థంలాగా భావించేవారు.

"బుద్ధుడికి బోధివృక్షం
జ్ఞానోదయం
మందబుద్ధుడికి కల్పవృక్షమే
కార్యోదయం"

బుద్ధుడికి బోధివృక్షం కింద జ్ఞానోదయమయిన సంగతి లోకమెరిగిన సత్యమే. కాని మందబుద్ధుడి గురించి బుద్ధుడు కూడా చెప్పనట్లుంది. నిజంగా మందబుద్ధుడు కూడా కల్లు సేవించినాక ఎలాంటి కార్యాన్నయిన చేయగలిగే సత్తువ, తెగింపు

వస్తాయి. ఈ కవితలో కవి చమత్కారంగా చెప్పినప్పటికి యధార్ధమే చెప్పాడు.

"చేపపిల్లలా ఎదురెక్కి
ఆకాశగంగను
నేలకు దింపాడు"

"మెర బెడుతూ
జీవితం అరిగిపోయింది
కల్లు ఊటలా కంట్ల చెమ్మ"

పాతాళ గంగను ఆకాశ గంగగా మార్చిన తాటిచెట్టును రోజుకు మూడుసార్లు ఎక్కి ఎక్కి నాయన చివరకు ఆకాశానికి చేరిండు. ఎంత మంది నాయనలు ఇలా నేల రాలారో? ఒకప్పుడు గౌడు పనితనం పరిశీలించడానికి, తాడుమీద గౌడు మెరపెడుతుంటే క్రింద పడ్డ మెరను చూసి పిల్లనిచ్చేవారట!! ఆ మెర చాలా పలచగ ఉంటే కల్లు ఎక్కువవుతుంది. గెల ఎక్కువ కాలం ఊట మనుగడలో ఉండడం వలన కల్లు చాలా రోజులు తీయగాలుగుతాడు. సంసారానికి లోటు ఉండదు. పిల్లను సాదగలడు, సమర్థుడు అని నమ్మేవాళ్ళు. అలాంటి గౌడుల చేతిపనితనం గొప్పదనాన్ని చెబుతూ వారి జీవితాలను కవి హృద్యంగా రాశాడు.

"దేశదిమ్మరిలా
తాడుపై నిలువుగా నడిచే
దివిబాటసారి
జర పైలం
పాదం తప్పినా పట్టుతప్పకు"

నిజంగా గౌడ్ తాడుపై నిలువుగా నడిచే దివిబాటసారే. భార్య రోజుకు మూడుసార్లు ముత్తయిదువ మరియు మూడుసార్లు ముండమోస్తుందని ఊరికే అనలేదుగా? కాలుపట్టు తప్పితే కుటుంబమే పాతాళంలోకి పోతుంది. కాబట్టి అతని సతి రోజుకు మూడు సార్లు వీరతిలకం దిద్ది పంపుతుంది. అందుకే కావచ్చు గౌడ్ రక్తానికి సాహసమెక్కువ.

"మోకు ముస్తాదు
కత్తులు చిడతబద్ద

మెడలో మోకు
పులిచర్మం ధరించని పరమేశ్వరుడు”
గౌడ్ ప్రతిరోజు ప్రతిపూట ఆయుధాలతో పరమేశ్వరుడిగా, కాళీమాతగా కనిపించే చల్లని స్వామి. గౌడ బిడ్డలందరు శివపుత్రులే. ఈ ఆయుధ ధారి ఉగాది పచ్చడి కన్నా కమ్మటి కల్లును జనంకు పంచుతలేడా !
“తాటి చెట్టుకే కాదు
అతని వంటికీ
కాయలు కాస్తాయి”
కవి ఈ వాక్యాలతో గౌడ్ ఒంటిపై ఉన్న కాయలను గుర్తుచేశాడు. నాయనా! కాయలు ఎక్కడెక్కడ కాస్తాయి అని అడిగితే కాయలు కాయని ప్రదేశం లేదు బిడ్డా అన్నాడు. అవి తాటి కాయల్లాగానే ఉన్నాయి. తలపై, భుజాలపై, వీపున, ముంజేతులకు, చేతి మట్టలకు, ముడ్డిపై, పాదాలపై, అరిచేతులపై, నడుముపై ఇంకా చెప్పరాని ప్రదేశాలలో కూడా ఉన్నాయి. ఏ సైనికుడు కూడా ఇంత కష్టపడతాడా? అనిపించింది. ఈ వాక్యాలతో కవి బాధనంతా కుండలో పెట్టి ఇచ్చినట్లుంది.
“ఊరముత్యాలమ్మకూ
కల్లు తాగ బుద్దయింది
సాకపోసి కావడి కట్టమంది”
ప్రతిఏటా శ్రావణంలో వచ్చే ఊరముత్యాలమ్మకు మరియు ఇంద్రవెల్లి ముత్యాలమ్మకు చిన్న చిన్న బుడతగాళ్లు చిన్న తాటిమట్ట, రెండు గురుగుల నిండా తియ్యటి కల్లుతో, కావడితో, ముద్దు ముద్దు అడుగులతో, బోనాలతో ఊరంతా ఊరేగి అమ్మవారికి శాక బోస్తె ఎంత ధైర్యంగా అనిపించేదో ! ఇది అనేక తరాలనుండీ పూర్వికులు అనుసరించిన మన దేశీసంప్రదాయం.
“తల్లిపాలు లేవాయే సొక్కమయ్యా
ఇదిగో గురిగి తాటికల్లు”
బాల్య వివాహాల వలన పూర్వం చిన్న వయసులో పుట్టిన ఆడపిల్లలకు రొమ్ములు సరిగా వృద్ధిచెందకపోవడంచేత రొమ్ముల్లో పాలు ఉండేవి కావు . అలాంటి వారికి పుట్టిన పిల్లలు తాటికల్లు, గురిగిబువ్వతో బ్రతికినారట! మా నాయనను వాళ్ళ

నాయనమ్మ ముద్దుగా సొక్కమయ్య అని పిలిచేదట! కులాలతో సంబంధం లేకుండా ఇలా ఇంటికో సొక్కమయ్య ను కాపాడిన తాటిచెట్టు నిజంగా మృత సంజీవిని.

"పుట్టలో పాలు పోస్తే వికృతి
పొట్టలో కల్లు పోస్తే ప్రకృతి"

కల్లు ప్రకృతి ద్రవం. పాలు కూడా ప్రకృతి ద్రవమే. కాని మనిషి వికృతి చేష్టలకు పరాకాష్ట గురించి ఈ కవితలో చెప్పాడు. పుట్టలో పాలు పోస్తే దేనికి పనికి రాకుండా పోతాయి. పొట్టలో కల్లు పోస్తే హాయిగా ఉంటుంది కదా. పాలను పొట్టలో పోస్తే మంచిది. కాని పుట్టలో పోయడం వృథా అనే అర్థం కూడా వచ్చేలా రాశాడు.

"ముంజ ముంజలో
ముక్కంటి రూపం
తాటికాయ మరో దేవాలయం"

తాటికాయ మూడుకళ్ళున్న శివుడిలాగా ఉంటుంది. కాబట్టే ముంజలల్లో ఉన్న నీళ్ళు ఎంత స్వచ్ఛంగా మధురంగా ఉంటాయి. నిజంగా శివుడు అలాంటి ప్రదేశంలోనే ఉంటాడు కాబోలు. ఇంతకన్నా చల్లని చలువచేసే ప్రదేశముందా ప్రపంచంలో?

"మెరబెట్టినా కొద్దీ ఏటి ఊటలా
గోరేటి పాటలా ఉట్టే కల్లే కవిత్వం"

గోరేటి వెంకన్న పాట, కోయి కోటేశ్వర రావు మాట కన్నా, తేనె కన్నా, నీటి ఊటకన్న, తిక్కన పద్యంకన్నా, తినేగారేలకన్న ఏటి ఊటలా ఆగకుండా పారే నా కల్లు ఏమాత్రం తక్కువ కాదని కవి అంతరార్థం.

"మూడోగీతకై ముస్తాదు కడితే
తాడు తాడుకు నాయినకు తోడు నేనే!"

ప్రతి గౌడబిడ్డ అనుభవించే ఉంటాడు. మూడోగీత అంటే సాయంత్రం ఏడు ఎనిమిది గంటలకు గీస్తారు. వేసవి కాలం ఎత్తైన కుమ్మరోని చెట్టు, పీతిరి చాట, పెద్దతాడు, వెంకటపాపయ్య చెట్టు, జొన్నల రాశి చెట్టు వంటి చెట్లలను మా నాయన ఎక్కినప్పుడు, కీచురాళ్ళ అరుపులు, కీసుమనే గాలి, తాటి కమ్మల చప్పుడు, ఎక్కడో

కనిపించకుండా ఆకాశంలో నాయన, ఆ భయంతో క్రింద నేను సమీపంలో ఎవరు లేరు. మాకు మేమే తోడు. ఆ భయం ఇంకా మనసు లోపలి పొరల్లో భద్రంగా ఉంది.

అంతే కాకుండా ఈ కవితా సంపుటిలో కర్రపుల్లల కల్లు, పోతుకల్లు, వంపగొలల కల్లు, వడబట్ల కల్లు బుంగ దుంకుతుందని చెప్పిన విధానంలో కాలసందర్భాలనూ చెప్పాడు. సంపూర్ణంగా గౌడజీవితంనుండి వచ్చిన కవులు మాత్రమే వారి ఆవేదన, జీవన సౌందర్యాన్ని కవిత్వంలోకి తీసుకురాగలరు. ఇందులో రాసిన ప్రతి పదం అనుభవించి, శోధించి రాసినందుకు అభినందిస్తూ, ఆశీర్వదిస్తూ ... కవికి వేయాల్సిందే అభినందనల వీరతాడు.

**06.05.2025**

నీ అన్న
**శీలం వీర శేఖర్ గౌడ్**
అసిస్టెంట్ ప్రొఫెసర్,
ప్రభుత్వ డిగ్రీ మహిళా కళాశాల

# ఏం రాయాలబ్బా !?

సుదీర్ఘ ప్రయాణం ముందు... మాటలు ఎలా ప్రారంభించాలో అర్థం కాదు. ఒకింత ఇబ్బంది ఉంటుంది. వ్యక్తి అనుభవాలు రాయాలంటే ఇదితగిన సమయం కాదు. ఏదో ఒకటి రాస్తే ఎవరు చదువుతారు? కొత్తది రాయాలి. కొత్తొక వింత...పాత సామెత ఉన్నదే కదా! అవును గుర్తొచ్చింది. ఏదైనా రాయాలంటే ఈ కవిత్వానికి ప్రేరణ, పడిన పాట్లు రాయొచ్చులే అనుకుని రాయడం మొదలు పెట్టాను.

వాస్తవానికి నా గురించి పదిమందికి చెప్పుకోవాలనే ఉంది. అయినా దానిని ఉగ్గబట్టి కవిత్వం గురించి రాస్తాను. ముందుగా అట్టమీద బొమ్మగురించి రాయాలి. బొల్లెద్దు కిశోర్ అన్న వేసిండు. ఇంతకు ముందు "గంగెద్దు" పుస్తకంకు కూడా అన్ననే వేశాడు. ఎవరో వేస్తారని నలుగురు అంటే ఎవరెవరినో అడిగాను. ఒకసారి కాదనిపించుకుంటే మళ్ళీ అడగను అనే మొహమాటం మనిషిని కాను కానీ, బొల్లెద్దు కిశోర్ అన్న బ్రహ్మాండంగా వేసిండు. మనకు మేలు చేసేవారి మంచిని కోరడం కనీస బాధ్యత. బొల్లెద్దు కిశోర్ అన్న రెడ్ లిస్టు సినిమాను దర్శకుడుగా చక్కగా తీశాడు. దర్శకుడుగా విజయవంతం కావాలని అక్షరం సాక్షిగా కోరుకుంటున్నాను. ఇకపోతే నా సాహిత్య బండికి దాపట వల్పట ఎడ్లున్నాయి. డా. వి. జయప్రకాశ్, డా. సాగర్ల సత్తయ్యలు. గీ అన్నల పరిచయం కాకపోతే కథా రచయితను అవుదునో కాకపోదునో.

ఏదన్నా పనిజేస్తే ధ్యానం చేసినట్టుగా చేసే అలవాటు ఉంది. కరోనా కాలంలో తీర్పాటంతో కథలు రాసినా అంతకు ముందే ..ఐదేళ్ళ ముందు ఈనాడుకొక బాలల కథను రాశాను. తరువాత మర్చిపోయిన. కరోనా కాలంలో వీళ్ళిద్దరూ దుర్మార్గులు నన్ను కథాప్రపంచంలోకి లాగారు. నా బుద్ధి యాడికి పోయిందంటారు? తెలుగు ఉపాధ్యాయుడిని కదా!? కవి, రచయిత అనిపించుకోవాలని ఉబలాటం. అయితే వీళ్ళు దుర్మార్గులు ఎలా అవుతారు? కాకపోతే నాకంటే ముందు నుండే రాసేవాళ్ళు. బాగా రాయగలిగే వాళ్ళు. వాళ్ళు రాయకుండా నన్ను లాగడం దుర్మార్గం కాదా? నాకు దక్కిన లెక్కకు మించిన కీర్తి నిజానికి వీరిదే. నేను మాత్రం అదేదో ఉద్యమం చేసినట్టు రాస్తానా!? అందరూ ఏమంటున్నారు! పుట్టిన పిల్లగాడు ముందు దొర్లాలి. అంబాడాలి, లేవాలి, అడుగులో అడుగెయ్యాలి, నడవాలి. కానీ నేను లేచి ఉరకడమే. అందరూ నవ్వుతున్నారు. ఆశ్చర్యంతో నవ్వుతున్నారా! ఆనందంతో

నవ్వుతున్నారా ముఖ్యం కాదు. అందుకని ఈ దుర్మార్గులకు ధన్యవాదాలు చెప్పను. ఎప్పటికీ గుర్తుంచుకుంటాను. అంతే!

ఇంట్లో బాలసాహిత్యం, చరిత్ర పుస్తకాలు, కథలు, నవలలు, వారపత్రికలు సీరియల్స్ ..అబ్బో చిన్నప్పుడు చాలానే ఉండేవి. నిజానికి ఆ రోజుల్లో నాయిన కూడా అవో ఇవో రాసేవాడు. అవన్నీ భద్రపరిచేవారు లేరు. నా మొదటి పుస్తకం చూసి ఆయన ఎంత మురిసిపోయారో. మా అన్న శీలం వీర శేఖర్ కూడా మంచి రచయిత. ఇంటర్మీడియట్‌లో ఆయన రాసే కలం స్నేహం ఉత్తరాలు, డైరిని దొంగచాటుగా చదివేవాడిని. నా చుట్టూ ఇంత మంచి వాతావరణం ఉన్నాక ఇక నేను సాహిత్య సేద్యం కాకుండా ఇంకేమి చేస్తాను. నా గురించి చెప్పను అని మళ్ళీ నా గురించే చెబుతున్నానని అనుకోవద్దు. నా చుట్టూ ఉన్నవారి గురించే చెబుతున్నాను. హా మర్చిపోయాను. నేను గంటలు గంటలు ఇలా రాసుకుంటూ పోతే.... కుటుంబం!? నిజం. శ్రీమతి, పిల్లలు వారికి తోచిన విధంగా చక్కగా సహకరిస్తారు. చుట్టూతా మంచివారే. మరి రాయడం ఎందుకు? కేవలం చెడ్డవారి గురించి మాత్రమే రాయము కదా! అయినా లోకంలో మంచి చెడులు మాత్రమే ఉండవు. ఈ రెండింటి మధ్య మరొక స్థితి ఉంటుంది. అదే మన (నా) జీవితం.

ఇది నా జీవితం. ఇందులోని కవితలు నా భయాలు, భావోద్వేగాలు. దీనిని కవిత్వంగా తీసుకురావాలనుకున్నప్పుడు ముందుమాట రాసిన తెలంగాణ జీవకవి మునాసు వెంకట్, సాహిత్య విమర్శకు తెలంగాణలో సాన డా. తందు కృష్ణ కౌండిన్య, నా చిన్నప్పటి కథల గూడు, రాతగాడు, సావాసగాడు, అన్న శీలం వీర శేఖర్ గార్లకు ధన్యవాదాలు.

మాదగాని శంకరయ్య గారికి, తుల శీనన్న గారికి, సృజన సాహితీ సంస్థ అధ్యక్షులు పెరుమాళ్ళ ఆనంద్ గారికి, **ద్వితీయ ముద్రణకు ఆర్థికసాయం అందించిన జనగాం రవీందర్ గౌడ్, మాజీ సర్పంచ్, తాళ్ళ వెల్లంల గారికి, వారిని పరిచయం చేసిన శ్రీ నకిరెకంటి శీనయ్య గారికి నా ప్రత్యేక ధన్యవాదాలు.** చదివే మీ అందరికి ధన్యవాదాలు. ఇందులో మీ పేరు వెతక్కండి. మీరు నా దగ్గరి వాళ్ళే. నాకు గుర్తుంది. స్థలం లేదు. ఉంటాను. కాదు కాదు త్వరలో మరో పుస్తకంతో కలుస్తాను.

**-శీలం భద్రయ్య**

## నేటిగీతం పాడుతాను

ఊటగట్టిన నిత్య శ్రామికుని
చెమట సింధువు గురించి
అవకాశవాద రాతలు
తడిపొడి గీతాలను
బానిసత్వపు రోతను వదిలి
తత్వగీతాన్ని పాడుతాను
తప్పిపోయిన సమానత్వపు
జాడను చూపుతాను
(స)మానవత్వపు మండువాను
గురించి నేటిగీతం పాడుతాను
ఎద్దుతోలును వలిచి
తంగేడు చెక్కతో శుద్ధిచేసి
ఆరబెట్టి సానబెట్టి
మురిపెంగా ముస్తాదు కుట్టి
గౌడన్న చేతికిచ్చిన నీ చేతిచలువను
గుర్తుచేసి కడజాతి కట్టుబాటు
ఎక్కడిదని పాటగా చేసి పాడుతాను
మట్టి ముద్దను పసిబిడ్డగా చేతుల్లో
తీసుకుని ఒడుపుగా వృద్ధిచేసి
తొట్టిలో బిడ్డను లొట్టిగా మార్చి
గౌడజాతికిచ్చిన కన్నతండ్రి ప్రేమను
పాటగా చేసి పాడుతాను
బోనంచేసి తల్లికి, పిండాలకు
ఆరబోసే సబ్బండ వర్గాల సంస్కృతికి
సాష్టాంగపడుతూ నేటిగీతం పాడుతాను
మండువా దగ్గర పండుగలా
ఎక్కువ తక్కువలను మరిపించి
ఆడించి పాడించి పాలించిన
సురాగీతం ఘనత
ప్రతీతరానికి వినిపించేలా
నేటిగీతం పాడుతాను
సర్వమతాల సారాంశమొక్కటేనని
శోధన మించిన తత్వగీతాల సొదకు
అక్షర చిరునామా తాటియాకులే
కాదాయని సిరను మించి
సురను కీర్తించే
నేటిగీతం పాడుతాను
రంగునీళ్ళ దళారీల చేతుల్లో
మండువా మండుతుంది
చుక్కలనున్న సురను దింపే
నా చక్కని తండ్రులు
రోజుకో తాటిపండులా
నేల రాలుతూ ఉంటే
గాలి దుమారానికి వణుకుతూ
నేలపై తెగిపడిన లొట్టి పెంకులా
ఆనవాలు కోల్పోయిన
మూగగొంతుల తరపున పాటగా
చేసి
ఈ **ముస్తాదు** గీతం పాడుతాను

**–శీలం భద్రయ్య**

రెండవ ముద్రణ

# ముస్తాదు

(కవిత్వం)

తాటిచెట్టుతో బాటు

గౌడు నడుముకు మోకు

బిడ్డ మెడలో బొడ్డుతాడు

శ్లోకం కంటే

శోకాన్ని బాపే

నా రేక పవిత్రం

గౌడన్నల జీవితం

ఆరుద్ర పురుగు

కార్తె వెనుక జీవనపరుగు

దీపదూపాలు

తీర్చలేని దుమారమంతా

తీర్చింది తాటికల్లు

యాదించుకో ...!

మందుకల్లు కాదు

ఎతశితకు "మందు" ..... "కల్లు"

కల్లుందా పిల్లుందా!?అని అడగకండి

మండువాలో....

అమ్మా చెల్లి ఉంది

విశ్వకర్మ త్రిశంకుస్వర్గం

మండువా!

గౌడమ్మ పట్టపురాణి

మంగళవాయిద్యాలతో

కట్టిన మామిడాకు

పైకప్పునున్న తాటాకును చూసి ఈర్ష్యపడ్డది

వయసుకొచ్చిన ఇంద్రధనుస్సు

వనంలోని పోత్తాడును చూసి

వయ్యారంగా సిగ్గుపడింది

అతని మోకును చూసి

ధర్మసూత్రాలు

ఉపనయన దీక్షను తీసుకున్నాయి

బతుకమ్మలా

మర్రిచెట్టును

నెత్తిన ఎత్తుకుంది తాటిచెట్టు

వనం బతుకమ్మ తాటిచెట్టు

చేపపిల్లలా ఎదురెక్కి

ఆకాశగంగను

నేలకు దింపాడు

మెర బెడుతూ బెడుతూ

జీవితం అరిగిపోయింది

కల్లు ఊటలా కండ్లల్ల చెమ్మ

తాడుపై

నిలువుగా నడిచే దివిబాటసారీ...

జర పైలం!

పాదం తప్పినా పట్టుతప్పకు

రాజుకున్న రాత్రి అక్షరాలన్నీ

నిద్రబుచ్చి మాయమయ్యాయి

ఎలాగైనా ఈరాత్రికి పట్టి

తాటిమొద్దుకు కట్టేయ్యాలి

గుజిది ఉడుంపట్టు

యమపాశానికి

వొళ్లు వణికింది

శబరీ ...!

వనంలో కల్లు దొరకలేదా !?

రేగుపళ్ళు పెట్టావు !!

వనంలోని తాటిచెట్టు

కర్ణుడిలా కల్పవృక్షమే

అడిగిందల్లా కాదనదు

నక్కిన తారలన్నీ

సందెకాడికల్లు రాగానే

లొట్టలేస్తూ లొట్టిని చుట్టాయి

గురిగి కల్లు గంజినీళ్ళలా

గరీబోని గొంతులో

పానం నిలిపింది

తేనెటీగలు!

తేనెపట్టు నొదిలి

కల్లులొట్టి మీద వాలాయి

వనంలో తాటిచెట్టు

సిగ ముడుచుకున్న

అమ్మలా ఉంది

వెన్నులు

ధనువులా వంగినా

తాటిచెట్టు నిటారుగా నిలబెడుతుంది

తులసీదళం పవిత్రత

తాటాకు ఎదమీదనే

రాసిపెట్టి ఉంది

కాకి– కల్లు

ఎంత బలగమున్నా

చెట్టుపై ఒంటరి

పాదరక్షల జతగాళ్లుగా

తోలు చెప్పులు

తాటి జగ్గలు

గూడు కూలింది

చెదరని తాటిదూలం

ముస్తాదును లేత చేతికిచ్చింది

ఒంటి నిండా

చెరపట్టిన చెక్కెర విరుగుడుకు

తాటిబెల్లమే అక్కర

మండువా దగ్గర ఒక్కపట్టుతో

జీవిత పాట్లన్నీ

పాటగా మారాయి

తాటిచెట్టుపై గౌడుచేయి

సంగీతం

మొదలైంది

గీతకారుడి కళ

అన్నమయ్య తాళపత్రాలలో

తణుకులీనింది

అనాదిగా అగ్రకుల సహాయనిరాకరణ

తీర్థానికి దొరికిన ప్రచారం

కల్లుకు దక్కలేదు

గౌడు చెమటకు

తల్లి తాటిచెట్టు ఎద ఉప్పొంగింది

గెలకంటి నుండి

బొట్లు బొట్లుగా ఆనంద భాష్పాలు

నడుముకు ముస్తాదు

భుజంపై మోకు

పులిచర్మం ధరించని పరమేశ్వరుడు

కల్లు మా కులదేవత

మండువా మా భరతమాత

తాటిచెట్టు మా జాతి పతాక

సర్వాయి మా జాతిపిత

తాటిచెట్టు దేహంపై

అతనో ఆర్తి నిండిన

అశ్రుకణం

పిల్లగాలికి

తాటాకులు పిల్లల్లా

గలగలమని నవ్వుతాయి

తాడిచెట్టుపై

ఆకాశ ఫలపుష్పాలు

ముంజలు

ఈత పండ్లను

ఇంపోర్టెడ్ ఖర్జుర చెట్టు

కొండచిలువలా మింగేసింది

తాటికల్లుదేం మతం?

మత్తునిచ్చినా

మానవతత్వాన్నే బోధిస్తుంది

మొదటగా పలకరించి

చివరగా వీడ్కోలు తీసుకునే

అతని ఆప్తనేస్తాలు

సూర్య చంద్రులు

తియ్యగా ముక్కుకు తగిలే

తాటిపండు తీపి

ఆరో జ్ఞానేంద్రియశక్తి

తాటిచెట్టుకే కాదు

అతని వంటికీ

కాయలు కాస్తాయి

తాటి గెలకు

బతుకు గాలానికి మధ్య

ఒడవని నిట్టనిలువు అడుగులు

ముంతాజ్‌కు తాజ్ వింత

నీకొరకు ప్రేమతో

ఈ "వాడుక ముంత"

పాచిపని పాలేరు పని

అలిసిన దేహానికి

పావన జలం

పరవశింపజేసే ప్రకృతిగంగను

నేలమీదకు దింపే

అపర భగీరథుడు

సబ్బండ వర్గాలను

బహుజన "తాడు"తో బందిద్దాం

సమర నినాదంతో అధికారాన్ని సాధిద్దాం

తాటివనం

తీర్ధ క్షేత్రం!

తాటికల్లు

అమృతతీర్ధం!!

ఈతముల్లుతో

బిడ్డల కాపాడుకునే

గర్భరక్షాంబిక

రెండు కళ్లు మోసం చేసినా

మూడోకన్ను నాలుగోకన్నుతో

ముంజకాయలు మురిపిస్తాయి

నేలరాలిన తాటిపండు

భూమిని చీల్చుకుని

గేగులా మొలకెత్తగలదు

మౌనం గానంగా

మారడం చూసి

విశ్రమించిన రేక అవాక్కయింది

గౌడు భుజాన

కావడి కుండలు

శ్రవణకుమారుడి తల్లిదండ్రులు

ఎర లేదు వల లేదు

మందువాకు

మచ్చికయినై

ఆడబిడ్డకన్యాయం

కొడుకుకు తాళ్ళ పాలు

బిడ్డకు విన్నపాలు

ఊరముత్యాలమ్మకూ

కల్లు తాగబుద్దయింది

సాకపోసి కావడికట్టమంది

పలుగురాళ్ళ నెరుసు

గౌడవృత్తికి

ఇరుసు

తాటిచెట్టు భుజాలనెక్కి

గరికను కూడా

గమనించే గరుడపక్షి

అశోక వృక్షం కాదు

అగ్నిపరీక్ష లేదు

తాటిచెట్టు కింద

వనదేవత మా గౌడమ్మ

ఆకలి దూప

వెతికింది

మండువా వాకిలి

గౌడు

తాటిచెట్టుపై

తాండవమాడే

కంట్ల మహేశ్వరుడు

తాటిచెట్టు కింద

ఆగడం తాగడం తప్పుకాదు

వాగడమే ముప్పు

వంటిమీద సగంబట్టతో

జనం వనంలో

ఎత్తునున్నవాడు గౌడు

మట్టి ముంతపోయి

కొత్తరంగుతో వచ్చిన సీసా

సంసారాల్లో చిచ్చుపెడుతుంది

తాటిచెట్టు !

ఎంత పెరిగినా

కల్లుధర నేలమీదే ఉంది

తల్లిపాలు లేవాయే

సొక్కమయ్యా

ఇదిగో గురిగి తాటికల్లు

కుబుసం విడుస్తున్న

నల్లనితాచులా ఉంది

గెట్టుమీద గరిమట్టల బొత్త

తాడు మీద

రెక్కలాడితేనే

ఇంటికాడ బుక్కలాడుతాయి

రంగునోట్లుకై

రంగునీళ్ళ ఆశ

దిగులు బుగులు తీర్చు

తాటికల్లు ధ్యాస

ముంత

కొసరుకు

బుంగ బేరం

వజ్రదేహానికి

మడ్డికల్లు

వట్టి దేహానికి తీపికల్లు

కల్లు!

దొరల దాష్టికాలనెదిరించిన

ఆత్మగౌరవ అగ్గిపటాలం

తాటిచెట్టుపై

పిడుగుపాటు

గౌడన్న గాసానికి గ్రహపాటు

కల్లు చుట్టూ కందిరీగలు

కష్టాన్ని తాగి

ముఖం వాచేలా కుట్టాయి

ముస్తాదును

నడుముకు కట్టిన వస్త్రాదు

చెమటోడ్చి

ఊరిదూపను తీరుస్తాడు

యాదవులకున్నట్టు

తాటి గెలలకో

గీతకారుడున్నాడు

కళ్ళతో చూడలేని

లోకాన్ని కూడా

కల్లుతో మార్చగలిగే వైద్యుడు

తాటిచెట్టు!

వనం నాయకుడు

నీడను కోరదు

కొత్తపెండ్లి పిల్లలా

కర్రపుల్లల కల్లు

కన్యాదానంలేని కట్నం

నీరసాన్ని

సోమరసం

పాదరసంగా మార్చింది

తాటికల్లుది

తప్పొప్పుల తర్కం కాదు

తగవులను తీర్చేతత్వం

వటపత్ర సాయి వరహాల లాలి

తాళపత్ర సాయి

తాటాకులా రాలె!?

తాటిచెట్టు వటవృక్షం!

సుడిగాలి ఎదురైనా

తలదించనితనం

తరాలెన్ని

తలదాచుకున్నా

తల్లిలా కాచింది తాటాకే

కల్లుబుడ్డి బలమంతురాలు !

కాకలు తీరిన యోధులనూ

పండబెడుతుంది

పోతుకల్లు!

చలిని చెలితో కలిపింది

పరుపుకల్లు!!

మూడుముళ్ళలో కలిసింది

కల్లు తాగిన పిక్క బలం

ముంజకాయల చక్రాలతో

ఊరంతా చక్కర్లు కొట్టింది

దొంగబొత్త

వంపగొలల కల్లు

వయసు గోడదూకినట్టు

బుంగ దుంకుతుంది

ప్రకృతి మాధుర్యం

అతని మొలకి అల్లుకున్న

మల్లెతీగ

పుట్టలో

పాలు పోస్తే వికృతి

పొట్టలో

కల్లుపోస్తే ప్రకృతి

నెలవంకకైనా

వంక పెడతారేమో !?

వంకతాడుకు ఏ వంకాలేదు

కల్లు సేవనంతో

కక్కని తలలో

తత్వము మొలిచింది

బుడ్డోడి నడకలా

తాటిచెట్టుపై తొలిసారి

తడబడి వణికే అడుగులు

కల్లు అంగడి సరుకు కాదు

అమ్మ రొమ్ములా

అమృతం

పాలన మనదైతే

పట్టాదారు మనమే

గౌడుల పక్షం

ధర్మబిక్షం

చెమట

నేల జారితేనే

కల్లు నేలదిగుతుంది

బెదిరించాలనుకోకు..!

ఎదిరించడం ఎగబాకడం

తెలిసిన కత్తులు ధరించిన

సర్వాయి వారసులం

అండ కోల్పోయిన సీతారాముడికీ

అందంగా తాటాకు

పందిళ్ళ పర్ణశాల

విడిపోయిన పిట్టలు

తాటి చెట్టుకింద

ఒక పట్టుపట్టాక ఒక్కటైనై

గీ చెట్టుకిందనే పాటకట్టిండేమో !?

కల్లుతాగిన యాదగిరి కంఠం

తూటాలతో నిజామును వణికించింది

పెత్తందార్లను పొలిమెర దాకా

దౌడు తీయంచిన

రౌతు గౌతు లచ్చన్న

సబ్బండ వర్గాలనూ

ఏకం చేసే ఏలుబడి

మండువా సందడి

ఎత్తయిన పెదతాడుకు

నీడ తక్కువైనా

జనం ఎక్కువే

ఎంతెత్తుకు ఎక్కి

కల్లుదింపినా

పట్టాదారు పెట్టేది

పంగనామాలే!

మెర బెట్టినా కొద్దీ

కొత్త గెల కల్లుతీపి

జీవితంలా మారుతుంది

కల్లుకల్తీ సరే...

కల్తీ నాయకుల మాటేమిటి !?

తల్లిపాలు తాటికల్లు

కల్మషం ఎరగనివి

గరిమట్టలో

గలీజు ముళ్ళు

ముంజ కొడవలి

ముందు మోకరిల్లాయి

కళాలి వృత్తి

కత్తెరకాయలతో

కళ తప్పిపోయింది

తాటిచెట్టు!

వనంలో ఒంటరి

నిలువ నీడలేకున్నా పరోపకారి

ముస్తాబైన ముస్తాదు

తాటిగెలలతో

ముచ్చట బెట్టబోయింది

సద్దికి బువ్వ లేకున్నా

ఉద్దెర బోసె

కత్తిబట్టిన

కరుణామయుడు

ముహూర్తంతో పనిలేదు

రేక పట్టినాక

బిడ్డ బేరం గొడ్డు బేరం

కుదిరింది

ఎంతెత్తు తాడెక్కినా

జీవితాలు

కురచనే !

కల్లు బేరం!

తలమీద కంటే

ఎదనిండా భారం

రియల్ దందాలో

తాటి సమాధులతో

ముస్తాదు పేగు ఎండిపోయింది

అమృతాన్ని

సురాసురులకు

సమంగా వంచిన నిస్వార్ధ సమవర్తి

జాతి ఏదైనా

ఎతలను

మరిపించే

జాతర మండువా

ఈదర గాలికి

తెగిపడిన లొట్టి పెంకులు

గుడిసె గుండెకు గుచ్చుకున్నై

ఆశ్రయమిచ్చిన పాపానికి

ఊడలతో

ఉరిపెట్టింది మర్రిచెట్టు

చెమటను చిందించి

కన్నీళ్లు తాగే

కల్లుగీత కార్మికుడు

సామాజిక కల్పవృక్షం

వృత్తిబంధం వృధా కాదు

మోకు ముస్తాదు

సంకెళ్ళు అనుకోకు

అరచేతిలో రేకలున్నాయి

ఓట్ల పండుగట

కల్లుబేరం నిండుసున్నా

కల్లురేకనే కాదు

తాళపత్రాలపై అతని

జ్ఞాన రేఖలనూ వెతకండి

పాదాలే కాదు

చెట్టుపై అతని చేతులూ

నిలువుగా నడవగలవు

దూపగొన్న గాలివాన

దొంగలా వచ్చి

లొట్టిని తెంపుకుపోయింది

కులమతాలు విడదీసినా

మండువా చాటున

మనసులొక్కటైనై

మండువా దగ్గర

చిల్లర రాలలేదు కానీ

ఉద్దెరగాల్ల

చిల్లర పంచాయితీతో పొద్దుపోయింది

జాగ్రత్త! నీ ఓటు కోసం

రంగునీళ్లను ఆశజూపి

జీవితరంగులను దోచే దొంగలున్నారు

ఆకలి చెట్టును ఎక్కితే

దూప

నేలమీద దేవులాడుతుంది

చిడతబద్ధపై నెరుసు పొడి

కత్తితో బాటు

కౌండిన్య కలం

పదును తేలింది

నాయిన దగ్గర

వాడికబట్టిన సూరీడు

కల్లుతాగనిది నిద్రబోడు

కల్లులా అమ్మ కండ్లల్ల కన్నీటి ఊట

రాత్రి వచ్చిన ఈదరగాలి

బువ్వగిన్నెను తన్నుకుపోయింది

కొమ్మలులేని

తాటిచెట్టుకు

చుట్టూ చుట్టాలే

ఎక్కిదిగే బతుకులని

ఎగతాళి చేయకండి

తాళిని పణంగా బెట్టి

తాడును గీస్తున్నాం

తల్లిరొమ్ముల చనుబాలతీపిని

తాటిచెట్టు నుండి తాగుటకు

దించిన దివి బాటసారి

నిన్న అలిగిన పక్షి

కల్లుదిగేయాళ్ల

నవ్వుకుంటూ మాటకలిపింది

ముంజ ముంజలో

ముక్కంటి రూపం

తాటికాయ మరో దేవాలయం

వనుకుడు పాపయ్య

కల్లుతాగిన ఎంకటిగాడు

భూమి గుండ్రమని భూపాలమెత్తుకుండు

దివి నుండి

భువికి దిగిన

ఆయుధ భూసురుడు

పైకి కిందకూ

తాటిచెట్టు మీద

రోజూ గౌడు తిరుగుబాట..

గౌడమ్మ కొలువైన

మందువాకు

సీతకున్న గీత లేదు

తగవులు లేని తావు తాటికల్లు

ఆలిపగలు లేవు

పాలిపగలు లేవు

ప్రకృతి పూజారి

నిత్య ప్రదక్షిణ

తాటిచెట్టు అతడి సజీవదైవం

నడుముకు కట్టిన ముస్తాదు గోసను

నడిజాముదాక విన్న తాటిచెట్టు

తెల్లారిందాక కన్నీరు పెట్టింది

చెరిగిపోని

తాటాకు శిలాక్షర సంతకం

పవిత్ర గ్రంథాలు

అక్షరానికి అర్ధాన్ని
మనిషికి తీర్ధం
నేర్పింది తాటాకే

చిమ్మ చీకటిలో
వెలుతురును
లొట్టిలో దొరకబట్టే
వేటగాడు

మండువా ఒక పాఠశాల
సకల కళలకు
అతడే గీతాకారుడు

మంత్రానికి

చింతకాయలు రాలవు

సురాపానమే అసలైన సత్యయంత్రం

తాడు వట్టిపోయిందని

లొట్టిమీద కాకి

వట్టిగనే పోయింది

ఎగగొట్టిన పాతబాకీ

ఆకలి దూపతో

మండువా కొస్తే

కడుపు చూసే కన్నతల్లి గౌడమ్మ

కుండంత

కల్లుతో

కొండంత బలగం

ముత్యాల సలువ ముంజలతో

ఎండకూ వెన్నపూస

రాసింది ప్రకృతి

చేతుల్లో కత్తులున్నా

ఒళ్లను కాయలు చేసుకునేవాడు

కల్లుగీత కార్మికుడు

చెట్టును నమ్ముకున్న

నింగీ నేల

నిజమైన సేతు

తాటిచెట్టుపై

ఎత్తైన సింహాసనం

బతుకు ఇంకా నేలమీదనే

కసిరినా మారం చేసే చిన్నపిల్లల్లా

తాటిగొలల కింద

కందిరీగలు, తేనెటీగలు

తాటిచెట్టుపై దొంగలు దొరల్లా

కోతులు ఈగలు

గౌడన్న కష్టం గంగపాలు

మెరబెట్టినా కొద్దీ

ఏటి ఊటలా

గోరేటి పాటలా

ఉట్టే కల్లే కవిత్వం

వెన్నదొంగ

అమ్మ దొంగా!

లొట్టిదొంగ

అమ్మో దొంగ!!

భాగ్యమున్న బాటసారుల

దూపకు

వనసత్రం మండువా

పటువనిండా మబ్బును

ఒడుసుకుని

పాలనురగతో కిందకు దిగాడు

గౌడు తాటిచెట్టు నాయి బ్రాహ్మణుడు

ముస్తాదుతో

ముస్తాబు చేసిండు

నలిగినా అలిగినా

సోపతికి నేనున్నా

అన్నది సోమరసం

చెమట నెత్తురంతా

లొట్టికి ఒడిసిన గౌడుసత్తువ

సకల కళలను ప్రసవించింది

వాన రాకడ

ప్రాణం పోకడ

గౌడన్నది

నిత్య ఊపిరియుద్ధం

బతుకమ్మకు

గౌరమ్మ

వనానికి గౌడమ్మ

ఎన్ని రేఖలున్నా మనిషిలోని

వక్రరేఖలను

తేటగా చూపించేది కల్లురేక

కల్లు తాగాక

సరసాల పలకరింపులతో

నవరసాల పులకరింపులు

రాత్రి అలిగిన

మాట

మండువాలో దొరికింది

కల్లు

రేకమీదకు

వచ్చేంత వరకూ

గౌడకష్టం ప్రసవవేదనే

గానాన్ని విని

గాయాన్ని మరిచింది

తాటిచెట్టు

లొట్టి నింపుకున్న

సింగారమంతా రేకలో

వయ్యారంగా దారలా పడుతుంది

గౌడమ్మ నవ్వును

నిషేధించడానికిది

మయసభ కాదు! మండువా!

తాటివనాలు గొప్ప తత్వకేంద్రాలు

మనో చికిత్సాలయాలు

ఆనంద నిలయాలు

ఆధునిక దేవాలయాలు

పోతుకల్లుతో

పోటీపడి ఓడింది సీసా

మందువాకొచ్చి గొడ్డుచాకిరీ చేస్తుంది

తాటిచెట్టు కింద

గుడాలు బుక్కిన నోరు

బడాయి పోతుంది

పోతులకు కోతులు

ఎగబడుతున్నాయి

ఏతులకు పోకుండా రారి

మందువా కొచ్చిన
దూపకొన్న వలసపక్షులు
నిండుగా తాగి వెళ్లిపోయాయి

పూదేనె నచ్చని
తేనేటీగలు
పోతుకల్లుకు ఎగబడ్డాయి

తాటిచెట్టు ముందుచూపుతో
ఎండనుండి కాయడానికి
ముంజలు కాచింది

కుండకో ముంత, కత్తికో ముంత

నేతన్నకో ముంత, నాతికో ముంత

రజకకో ముంత, నాయికో ముంత

పట్టాదారుకే వింత!?

కాలుష్యాన్ని చూడలేని

నీళ్లు

కల్లుతో

కన్నీళ్లు పెట్టుకుంది

బుద్ధుడికి బోధివృక్షం

జ్ఞానోదయం

మందబుద్ధుడికి కల్పవృక్షం

కార్యోదయం!

తాళవృక్షం!

అవసరాలన్నీ తీర్చే

పేదోడి కల్పవృక్షం

లొట్టి మీద కాకి

లొట్టలేసుకుంటూ తాగి

లొడ లొడా వాగుతుంది

తాటిచెట్టు మొదట్లో

వెన్నువిరిగిన తనువులు

జీవచ్ఛవాల్లా మంచాన పడిన బతుకులు.

తలుచుకున్నప్పుడల్లా
తలెత్తుకునేలా చేసింది
వనంలో తాటిచెట్టు

మదిలో పెట్టుకున్న
మనిషి తగువులన్నీ
తాటి మధువు తీర్చింది

బతుకమ్మ బోనం ఎత్తినట్టు
గౌడమ్మ కల్లుకుండను ఎత్తుకుంది
మండువా గౌరమ్మ గౌడమ్మే

గెలకు కత్తితో

పూటకో గాయం చేస్తున్నా

కడుపును నింపే కల్పవల్లి

తల్లిపేగు తెగిన

తాటిపండు

దబుక్కున రాలింది

మట్టిదెంత పుణ్యం

జీవుడికి

కల్లుబోత

దేవుడికి ఆరబోత

మట్టిపొదల్లో దాక్కున్న

తాటిపండు తొలకరిలో

తోకతో తొంగిచూసింది

కల్లుతాగిన వెన్నెల

నవ్వితే

చీకటికూడా చిన్నబోయింది

జానెడు పొట్టకు

తాటిచెట్టును వెతుకుతూ వెళ్లిన

రెక్కలులేని వలసపక్షులు

దిక్కులేని చావులు

డబ్బు దాచుకున్నట్టు

కల్లు దాచుకోగలిగితే

కష్టం పాచికల్లు కాదు

చేతిని పైకెత్తి బిడ్డను

మేఘానికి అందించినట్టు

తాడుపై గౌడన్న

వనంలో

ప్రకృతి వలపు

పోతు పరుపుల మధ్య

ప్రేమాయణం

పిడికెడు మెతుకులకు

ఎముకల గూడొకటి

తాటిచెట్టును గట్టిగా అల్లుకుంది

బెదిరించడం నీకలవాటైతే

ఎదిరించడమే

తాటికల్లు విధానం

నెత్తుటి రంగు బ్రాందీ

రోజుకో రోడ్డుతో

హెూలీ ఆడుతుంది

వనంలో తాటిచెట్టు !

జ్ఞానపుష్పంలా విచ్చుకుని

బుద్ధుడిలా ధ్యానం చేస్తుంది

ఉన్న

రంగులయిపోయాక

కల్లుతాగి

లోని రంగులను చల్లుకున్నారు

బుంగమూతి పెట్టబోకు

బుంగలో పొంగుతున్న కల్లు

మనదే

"కాకా!" నువ్వు లేక

కండ్లల్ల కాలువలు పారుతున్నై

తాళ్ళల్ల దూడలు దూపగొన్నై

నీది అవసరం

రాజుకు మొక్కుతావు

నాది ఆకలి

చెట్టుకు మొక్కుతాను

చీకటి చరిత్ర చిన్నబోయింది

అక్షరజ్యోతిని

వెలిగించినది తాటాకు

కల్తీకల్లు దందాలాగ

ఓటు ఆధారిత

రిజర్వేషన్ల అమలులో

బిసిలు ఓడిపోయారు

తాటిచెట్టు

గీతకార్మికుడి స్వేదసౌధం

సామాన్యుడి త్యాగమిది

ఉత్పత్తి కులాల భాగమిది

కల్తీకల్లు కన్నీళ్లు

మంచినీళ్లు మందునీళ్లు

మా నాయకులు... మహా నాయకులు

రాజన్న ఇంటికి

ఊపిరి పోసిన తాటిచెట్టు

దుమారానికి మోకుతో ఉరేసింది

పట్టాదారు తాటిచెట్టును

ఎత్తుకు ఎక్కినా కొద్దీ

అతని భూమి చిన్నదైంది

పోతుకల్లు నోట

పొగరు మాటొకటి

భాగ్యవిధాత గలీజురాత

బతుకు రోత పీత నత్త చెత్త

మాపటి కల్లు తాగి ఎత్తుకున్న పాటొకటి

రవివలె కవి

తూర్పు పడమరలు తిరిగే

“దిక్కు”మాలిన పక్షపాతి!

కులపట్టింపు లేని

సహపంక్తి సంజీవధార

మండువా కల్లు

పేరున్న పెద్ద బజారులో

ఆవు పేడమ్మా ఆవుపేడ

నడిరోడ్డుమీద

తాటి ముంజలమ్మా! తాటి ముంజలు

“రోహిణీ”... కళ్ళులేవా ?

ఒకసారి కల్లుతాగు

చల్లబడుతావు

అక్షరాలు తాటిరేకపై నుండి

అరచేతికొచ్చాయి

కడుపు నిండదు

దూప తీరదు

ముస్తాదును

నడుంకు కట్టి

ఊరి దూపను తీర్చే వస్తాదు

ఆదిదంపతులు

సురమాంబ కంట్లమయ్యలు మా ఇలవేల్పులు

సాకపోసి జాతర చేస్తాం జోలికొస్తే పాతరేస్తాం

ఎవరి బావిలో వాళ్ళు

గంజాయి మత్తులో

గరీబోడి భవిత చిత్తు

రిజర్వేషన్లు దగ్గరయ్యే కొద్దీ

దూరమవుతున్నాయి

ఈబిసిలు ముందుకు

ఎంబిసిలు వెనక్కి

మండువా మా గుడి

మండువా మా మసీదు

మండువా మా చర్చి

ఇక్కడ అందరూ మేమే

గుత్తాధిపత్యం

భూమి నీదె, చెట్టు నీదె

నాది ఉత్తాధిపత్యం

ఆకు కూడా నాది కాదు

తగువులాడితే భావస్వేచ్ఛ

తాటిచెట్టుకింద

బావస్వేచ్ఛ

అడవిని నక్కలు

న్యాయమైన వాటాలు వేసుకున్నాయి

అడవిబిడ్డ గౌడుకు చెట్టు కరువు

మొరబెట్టుకున్నా

తరిగిన గెల కరగలేదు

మెర బెట్టకున్నా

కండ్లల్ల ఊట ఆగలేదు

కచటతపలు

గజడదబలుగా మారితే

మతం –మదంగా మారిందని

మండువా చేసింది బోధ

గొంతు నొక్కావనుకున్నా!? ఆత్మను తొక్కావా !!?

లిక్కరు దందాతో

ఆదెరువు పోగొట్టుకున్న గీతకార్మికులకు

మోకు ముస్తాదు ఉచితం

నీతుల బురదతో

బుర్ర నిండిపోయింది

కల్లుపై చెడుప్రచారమే మిగిలింది

అలిసిపోయిన పంకా

శక్తిలేక నీరసపడింది

తాటాకు విసనకర్ర

నవ్వుతూ నిద్రపుచ్చింది

ఆలయ ప్రవేశం

కొందరిది

మండువా ముంగిలి అందరిదీ

కష్టాన్ని దోచి

అవయవ సంపదను కూల్చినా

అస్తిత్వాన్ని పోగొట్టుకోను

ఆస్తికాదు అధికారం కావాలి

ఆలోచన విత్తనాలు

తెల్లారేసరికి కాగితంపై మొలకెత్తి

ముస్తాదుపూలు పూశాయి

బుచ్చయ్య కల్లు లేదని

గుమ్మం దాకా వచ్చిన

హెూలీ రంగులన్నీ

చిన్నబుచ్చుకుని వెళ్లిపోయాయి

తాటిపాములు

తేనెటీగలు

పుచ్చు రాజకీయాలు

ఇసపురుగులు

అస్తమాకు ఉచిత చేపమందు

భాగ్యనగర బత్తిన సోదరులు

నిత్యస్మరణ త్యాగమూర్తులు

కల్లు ముందు

పురుగుమందు శీతలపానీయాలు

ఓడిపోతాయి

పేదోడి మొక్కు తీరితే

పోతురాజుకు

పొట్టేలు పోత్తాడు కల్లు

నెల గుడ్డునుండి నెలమాసికం దాకా

నెయ్యమైనా కయ్యమైనా

కడుపునిండా కడివెడు కల్లు

మర్మమేదున్నా

మండువాతో పేగుబంధం

మనుండగా మరిచిపోరు

పుండు చెక్కును

తొలచినట్టు

తాటిగెలకు

రోజుకో కొత్తగాయం

దారితప్పిన

తేనెటీగలు

తాటిచెట్టు కింద తారాడుతున్నాయి

కల్లు!

కఠిన హృదయాలనే కాదు

కిడ్నీ రాళ్ళనూ కరిగించగలదు

తాటిచెట్టుపై

పతంజలికి తెలియని

యోగాసనం

బహుజన ఐక్యతకు

మందువా రూపు

కల్లుపేర్పు

తెల్లవారినెదిరించి

త్రివర్ణజెండానెత్తిన

తాటిమొగి తెగువ బత్తిని మొగిలయ్య

మండువాలో గౌడమ్మ!

సబ్బండ వర్గాల

వనదేవత

తాటిచెట్టు!

మండువా ముంగిట

ఆలయ ధ్వజస్థంభం

మందువా!

దేహశుద్ధికి వచ్చినా

ఆత్మశుద్ధికి మరో నేస్తం

పుండు చెక్కుగీకితే

నెత్తురు కారినట్టు

కత్తి గాయానికి గెల కన్నీటి ఊట

వంటిమీద బట్టలూడబీకే

వడబట్ల కల్లు

సోయిలేకపోతే పట్టపగలు చుక్కల దారే

కల్లుకొచ్చి ముంతదాయకు

కడుపుతోనున్న

తల్లికైనా కల్లుతాపు

కలిగే బిడ్డలు కడిగినట్టుంటరు

తాగినంత సేపు

తలదించినా

తలెత్తుకునే పొగరు తాటికల్లు

మండువా!

వనంలో

వాస్తులేని గౌడు పిట్టగూడు

తాటిచెట్టు పునాదిలో

సమాధానాలులేని ప్రశ్నలు

సమిధలు సమాధులు

దసరా రోజుకాకున్నా

ఆయుధాలు రోజూ

తాటిచెట్టునెక్కి దిగుతాయి

జీవితాంతం అరణ్యవాసమే

కట్టమీద తాడు

సద్దిగంపనెత్తుకున్న అమ్మలా

నిలబడింది

కల్లు తాగిన కోతి

సముద్రాన్ని దాటింది

కొండను పిండి చేసింది

ఇది కథకాదు నిజం!

మూడు ముళ్ళ తాడుతో

సతి

తాడిచెట్టుపై

పట్టుజారితే చితి

తాటిచెట్టు మీద

కాలుజారింది

జీవిత పటువకు కట్టిన

ఉగ్గంతెగి నేలరాలింది

బొట్లు బొట్లుగా లొట్టిలో

తాటి చెట్టు వీర్యపు బొట్టు

తాగిన మెదడులో ఆలోచనలు పెక్కు రెట్లు

దసరా పాలపిట్ట

తాటిచెట్టుపై వాలింది

పావనజలం తాగి

పాడుతూ వెళ్ళింది

వనం కరువుతో

అంచె కల్లు

తలకు బరువుతో

సుట్టకుదురు

# మురిపెం...!

నాయిన తలపై... కండువా
పాపన్న గౌడు కిరీటంలా
పచ్చని తాడిచెట్టు మొగిలా ఉంది
కాళ్ళు, చేతులకు బంధనాలున్నా
నింగీ నేలతో బంధాన్నేర్పరుచుకున్న వాడు!
ఆఫీసులో లిఫ్టు పనిచేయక నాలుగు మెట్లెక్కి
అలిసిపోయినపుడు నాయినే గుర్తుకొస్తాడు
మూడోగీతకై ముస్తాదు కడితే
తాడు తాడుకు నాయినకు తోడు నేనే!
పెదతాడు పాదు దగ్గర భయంతో నేను
మొగివరకు మోకుమోతతో ఉత్సాహంగా
నిలువుగా నడిచే బాటసారి ఆయన!
ఆకాశంలో చందమామనేదో మెరబెట్టినట్టు
అరిగిన నెలవంక పొరలు పొరలుగా
నాపై వెన్నెలగా రాలిపడుతుంది
కూర్పాట్లు కంటికి దగ్గరవుతుండగా
ఏటిపక్కన ఎంకన్న భాగోత గీతాలు
మావిడి తోటల నుండి కాపోల్ల కూతలు
నాయిన దిగుతున్నట్టు తాడుపై మోకుమోతలు!
రెండు చేతుల లొట్లనిండా
ముక్కుకు తగిలే తీయని నురగలు
కల్లు తాగిన జనం
కష్టమంతా మరిచి పదం పాదం కదిపిపోతే
కందిరీగల కాటు, వాచిపోయిన మొకం
కష్టమంతా మరిసే
పచ్చని వనం నాయిన మురిపెం!

**– మా నాయిన కీ.శే. శ్రీ శీలం బుచ్చయ్య యాదిలో ...**



Sheelam Bhadraiah

**MUSTHADU**

A Collection of Poetry

శీలం భద్రయ్య 24 డిశంబరు 1980న అన్నారం గ్రామం, తుంగతుర్తి మండలం, సూర్యాపేట జిల్లాలో జన్మించాడు. వీరి తల్లిదండ్రులు శీలం యాదమ్మ, బుచ్చయ్య . తెలంగాణ మోడల్ స్కూల్, కనగల్‌లో పోస్ట్ గ్రాడ్యుయేట్ టీచర్‌గా పనిచేస్తున్నాడు.

కథారచయితగా, కవిగా సుప్రసిద్ధుడు. వీరి తొలికథ 'కేంపు చెరువు' నమస్తే తెలంగాణ దినపత్రికలో ప్రచురితమైంది. "లొట్టపీసు పూలు", "గంగెద్దు" కథా సంపుటాలను రచించాడు. తొలి కవితా సంపుటి "ముస్తాదు". "ఖూని" నాటికను రాశాడు. "పేర్పు' విభిన్నవ్యాసాల సంపుటి ముద్రణ దశలో ఉంది. తెలుగు అకాడమి ప్రచురించిన "తెలుగు భాష, సాహిత్యం" గ్రంథ రచయితలలో ఒకరు. వీరి సంపాదకత్వంలో "అంకురం", "యాస" కవితా సంకలనాలు వెలువడ్డాయి.

బహుజన అస్తిత్వ స్పృహతో రచనలు చేస్తున్న ఈయన కథల్లో తెలంగాణ భాష, సంస్కృతికి ప్రాధాన్యత ఉంటుంది. "లొట్టపీసు పూలు" కథల్లో తెలంగాణ సాయుధపోరాట కాలం నాటి కథలు వీరికి బాగాపేరుతెచ్చాయి.

"కల్లు మా కుల దేవత
మండువా మా భరత మాత
తాటిచెట్టు మా జాతి పతాక
సర్వాయి మా జాతి పిత"

-శీలం భద్రయ్య



శ్రీ జనగాం రవీందర్ గౌడ్

అధ్యక్షులు, లయన్స్ క్లబ్, చిట్యాల, సామాజిక సేవకులు, మాజీ సర్పంచ్, తాళ్ళ వెల్లంల, నల్లగొండ జిల్లా గారి సౌజన్యంతో...

ISBN: 978-93-5895-949-9



Price: 120



శీలం ప్రచురణలు